శ్రీమతే రామానుజాయ నమః



# నృసింహస్తుతి మాలిక

డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్, నరసాపురం

**2012**

# శ్రీనృసింహస్తుతి మాలిక

## డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రథమముద్రణము - 2012

ప్రతులు - 500

వెల - అమూల్యము.

ఆవిష్కరణము - ధనుర్మాసవ్రతపరిసమాప్తి సందర్భంగా

తేది - 14-1-2012



ముఖచిత్రం - శ్రీనృసింహస్వామి

**ఈ గ్రంథం శ్రీకృష్ణఛారిటబుల్ ట్రస్ట్, నరసాపురం (ప.గో.జిల్లా) భక్తిశ్రద్ధలతో సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడింది.**

**ప్రతులకు**

**1. శ్రీమాన్ రవిప్రకాష్**

4-1-17/3(2), కూనపరెడ్డివారి వీధి,
టి.టి.డి. కల్యాణమండపం దగ్గర, నరసాపురం-534 275,
ఫోన్ : 9494480283

డి.టి.పి. : 1. యస్.చంద్రశేఖర్, తిరుపతి.
2. శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

# మంగళాశంస

**"జన్మ కర్మ చ మే దివ్యమ్"** అని అంటూ సాక్షాత్తు భగవానునిచే దివ్యాలుగా భగవదవతారాలు కీర్తింపబడ్డాయి. **"బహూని మే వ్యతీతాని జన్మాని"** అనే ఇంకొక భగవానునిసూక్తి అవి అనేకం అని తెల్పుతున్నది. ఆ భగవదవతారాలలో పది ముఖ్యంగా లెక్కింపబడుతున్నాయి. వీటిలో నృసింహావతారం ఒకటి. కృత యుగంలో సంభవించిన ఈ అవతారాన్ని వేదేతిహాసపురాణాగమవాఙ్మయం విశేషంగా కీర్తించింది. **"మృగో న భీమః కుచరో గిరిష్ఠాః", "హరిం హరంత మనుయంతి దేవాః", "చత్వారి శృంగాః త్రయో అస్య పాదాః ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య"** ఇత్యాది పలు వైదికసూక్తులు నృసింహావతారాన్ని స్తుతిస్తున్నాయి. విష్ణు సహస్రనామస్తోత్రంలో కూడా **"అమృత్యుః"** అనే నామంనుండి **"సురారిహా"** అనే నామంవరకు గల 11 నామాలు నృసింహావతారాన్ని కీర్తిస్తున్నాయి. ఆళ్వార్లు, పూర్వాచార్యులు కూడా నృసింహస్వామిని పలు రీతులలో స్తుతించారు. ఈ రీతిలో నృసింహస్వామిని కీర్తించే వాఙ్మయం చాలా విస్తృతంగా కన్పిస్తున్నది. నృసింహ రూపంలోని దేవతారాధన పలు సంప్రదాయాలలో, పలు మతాలలో, పలు దేశాలలో ప్రాచీనకాలంనుండి కానవస్తున్నది. భక్తవాత్సల్యం, సర్వవ్యాపకత్వం అనేవి శ్రీనృసింహావతారంలోని ప్రధాన గుణాలుగా భాగవతపురాణం దర్శించగా, దివ్యసూరులు సింహ-నరరూపాల కలయికలోని అందాన్ని, భోగ్యతను అనుభవించారు.

ప్రస్తుతం **"శ్రీనృసింహస్తుతి మాలిక"** అనే పేరుతో ప్రచురింపబడే ఈ లఘు గ్రంథంలో **మంత్రరాజపదస్తోత్రం, ఋణవిమోచన స్తోత్రం, నృసింహాష్టకం, హర్యష్టకం** అనే నాల్గు స్తోత్రాలు భావంతోపాటు ముద్రింపబడుతున్నాయి. వీటితో పాటు **శ్రీనృసింహ ద్వాదశనామస్తోత్రం, శ్రీలక్ష్మీనరసింహాష్టోత్తర శతనామస్తోత్రం** కూడా చేర్చబడ్డాయి. ఈ గ్రంథాన్ని నరసాపురంలోని **"శ్రీకృష్ణచారిటబుల్ ట్రస్ట్"** ప్రచురిస్తున్నది. ఇంతకుముందు ఈ ట్రస్ట్‌ద్వారా **పూర్వదినచర్య - ఉత్తర దినచర్య వ్యాఖ్యానం, నిగమనప్పడి, శ్రీరామానుజస్తుతిమణిమాల, కూరనాథ పంచాశత్, ఉడైయవర్ తిరుమంజనకట్టియమ్** అనే ఐదు గ్రంథాలు ముద్రింపబడ్డాయి. ఇపుడు ఈ ట్రస్టు ముద్రించే ప్రస్తుత గ్రంథం ఆఱవది. వైదిక ధర్మప్రచారానికి, విశేషించి శ్రీరామానుజ సిద్ధాంతవ్యాప్తికి శ్రీకృష్ణచారిటబుల్ ట్రస్ట్ ద్వారా విశేషమైన కృషిని చేసే **శ్రీమాన్ కృష్ణారావు దంపతులను, శ్రీమాన్ రవిప్రకాష్ దంపతులను, శ్రీమాన్ బాలాజీని** హార్దికంగా అభినందిస్తున్నాను. ఈ ఏడు ధనుర్మాసవ్రతం పూర్తి అయిన శుభసందర్భంలో ముద్రింపబడే ఈ **"శ్రీనృసింహస్తుతి మాలిక", "వళ్ళుకిరాల్ ఇరణియనుడల్ ఇడన్దాన్"** అని అంటూ నృసింహుని కీర్తించిన గోదాదేవికృపకు పాత్రం కాగలదు. త్వరలో ఈ ట్రస్ట్‌ద్వారా ఇటువంటి సద్గ్రంథాలు మరిన్ని ముద్రింప బడాలని, అవి ఆస్తికుల ఆమోదాన్ని పొందాలని మనసారా ఆశిస్తున్నాను.

తిరుపతి **ఈ.ఏ. శింగరాచార్యులు**
8-1-2012

# మున్నుడి

**"మంతారం త్రాయత ఇతి మంత్రః"**అని మంత్రశబ్దవ్యుత్పత్తి. జపించేవానిని రక్షిస్తుంది కనుక మంత్రమనే పేరు కల్గిందని ఈ వ్యుత్పత్తిలోని భావం. ఆ యా దేవతలను ఉపాసించే మంత్రాలు ఎన్నో ఉన్నాయి. ఆ మంత్రాలు అన్నిటిలోను శ్రీమన్నారాయణ వైభవప్రతిపాదకాలైన మంత్రాలు విశిష్టాలు. ఆ మంత్రాలలో కూడా శ్రీమహావిష్ణుశబ్దవాచ్యుడైన శ్రీలక్ష్మీనృసింహస్వామిని ప్రతిపాదించే మంత్రాలు గొప్పవి. అటువంటి పలు మంత్రాలలో శ్రీనృసింహభగవానుని ప్రతిపాదించే ఒక గొప్ప మంత్రానికి మంత్రరాజమని పేరు. ఈ మంత్రవిశేషం ముప్పై రెండు అక్షరాలతో కూడినది. ఈ ముప్పై రెండు అక్షరాలను పదకొండు పదాలుగా విభజించి, ఒక్కొక్క పదాన్ని ఒక్కొక్క శ్లోకంలో కూర్చి, రుద్రుడు నృసింహస్వామి స్తోత్రం చేసినట్లు ఈశ్వరసంహితవల్ల తెలుస్తున్నది.

ఈ స్తుతికి మంత్రరాజపదస్తోత్రమని పేరు. దీనివల్ల శ్రీమహావిష్ణు శబ్దవాచ్యుడు శ్రీనృసింహస్వామియే- అని సువ్యక్తమవుతున్నది. అంతేకాక, లోకంలో ఉండే చరాచరాలు అన్నీ శ్రీనృసింహస్వామియొక్క విభూతియే అనే ఆ భావనతోనే సర్వజ్ఞుడైన రుద్రుడు శ్రీనృసింహస్వామి శ్రీచరణాలలో శరణాగతిని చేశాడని తెలుస్తున్నది.

ఈ మంత్రరాజపదస్తోత్రంలో చివరగా ఫలశ్రుతిని గూర్చి పలికేటపుడు - ఎవరు ప్రతిదినం దీనిని ప్రాతఃకాలంలో, మధ్యాహ్నసమయంలో, సాయంవేళలో జపిస్తున్నారో, వారికి సద్విద్య, దీర్ఘాయువు, ఐహికాముష్మికసంపద వృద్ధి కాగలదని చెప్పబడింది. సదాచార్యసన్నిధిలో ఈ స్తోత్రాన్ని భక్తులు ఉపదేశంగా పొంది, ఇందులోని అర్థాన్ని గ్రహించి, జపించి అభీష్టసిద్ధిని పొందాలని ఆశిస్తూ ఈ స్తుతి అర్థంతో పాటు అందివ్వబడుతున్నది.



# శ్రీ మంత్రరాజపదస్తోత్రమ్

పార్వత్యువాచ

1. మంత్రాణాం పరమం మంత్రం గుహ్యానాం గుహ్యముత్తమమ్ ।
బ్రూహి మే నారసింహస్య తత్త్వం మంత్రస్య దుర్లభమ్ ॥

పార్వతి ఈ విధంగా అన్నది.

మంత్రాలలో గొప్ప మంత్రం, రహస్యాలలో గొప్పదైన రహస్యం, లభించడానికి సాధ్యంకానిది అయిన నరసింహమంత్రంయొక్క తత్త్వాన్ని నాకు తెలియజేయాలి.

2. వృత్తోత్ఫుల్లవిశాలాక్షం విపక్షక్షయదీక్షితమ్ ।
నినాదత్రస్తవిశ్వాండం విష్ణుముగ్రం నమామ్యహమ్ ॥

గుండ్రని, బాగా వికసించిన, విశాలమైన నేత్రాలను కలవాడు (అటువంటి నేత్రాలతో భక్తులను కటాక్షించేవాడు), భక్తుల శత్రువులను నిరసించడాన్ని దీక్షగా కలవాడు, దానికి అనుగుణంగా వీరనాదాన్ని చేసినపుడు ఆ ఘోషతో బ్రహ్మాండాన్ని అంతటిని భీతిల్లజేసినవాడు, (భక్తరక్షణార్థం) అంతటా వ్యాపించి ఉన్నవాడు, (శత్రు సంహారసమయంలో తనను చూచిన శత్రువులు) "ఏమి ఈ ఉగ్రమైన రూపం"- అని భయపడే రీతిలో ఉగ్రరూపాన్ని కలవాడు అయిన శ్రీనృసింహస్వామికి నమస్కరిస్తున్నాను.

3. సర్వైరవధ్యతాం ప్రాప్తం సబలౌఘం దితేః సుతమ్ ।
నఖాగ్రైః శకలీచక్రే యస్తం వీరం నమామ్యహమ్ ॥

భగవానుని సృష్టిలోని ఎవరిచేతను వధింపబడని రీతిలో వరాన్ని పొందినవాడు, దితికుమారుడు అయిన హిరణ్యకశిపుని కేవలం తన నఖాల అగ్రాలతో ఖండించినవాడు, ఏ రీతిలో కలతను (భీతిని) పొందని సాటి లేని మేటి వీరుడైన నృసింహునకు నమస్కరిస్తున్నాను.

4. పదావష్టబ్ధపాతాళం మూర్ధావిష్టత్రివిష్టపమ్ ।
భుజప్రవిష్టాష్టదిశం మహావిష్ణుం నమామ్యహమ్ ॥

పాతాళంలో శ్రీచరణాలను, దేవలోకంలో శిరస్సును, ఎనిమిది దిక్కులలో భుజాలను కలవాడై, ముల్లోకాలను తన విశ్వరూపంతో వ్యాపించి నిలచి, అందువల్ల మహావిష్ణువు అనే తిరునామానికి లక్ష్యభూతుడైన శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

5. **జ్యోతీంష్యర్కేందునక్షత్ర జ్వలనాదీన్యనుక్రమాత్ ।**
**జ్వలంతి తేజసా యస్య తం జ్వలంతం నమామ్యహమ్ ॥**

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అగ్ని మొదలైన వస్తువులు ఏ భగవానుని అనుగ్రహంయొక్క ఏకదేశం (అత్యల్పభాగం)వల్ల ప్రాప్తించిన తేజస్సులో ప్రకాశిస్తున్నవో (జ్వలిస్తున్నవో), అటువంటి పరమాత్మస్వరూపమైన జ్వలించే శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

**"యస్య భాసా సర్వమిదం విభాతి"** ఇత్యాది శ్రుత్యర్థం ఇక్కడ అనుసంధింపబడింది.

6. **సర్వేంద్రియైరపి వినా సర్వం సర్వత్ర సర్వదా ।**
**జానాతి యో నమామ్యాద్యం తమహం సర్వతోముఖమ్ ॥**

జీవులందఱు పంచేంద్రియాలద్వారా లోకంలోని పదార్థాలనుగూర్చిన జ్ఞానాన్ని పొందుతున్నారు. కాని, ఏ ఇంద్రియంయొక్క సహాయం లేకుండానే అన్నిటిని అన్నిచోట్ల ఎల్లప్పుడు స్వయంగా తెలిసికొనేవాడు, కనుకనే సర్వతోముఖుడనే తిరునామాన్ని కలవాడైన ఆ నృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

7. **నరవత్ సింహవచ్చైవ రూపం యస్య మహాత్మనః ।**
**మహాసటం మహాదంష్ట్రం తం నృసింహం నమామ్యహమ్ ॥**

తన భక్తులపట్ల పరమోదారుడైన భగవానుడు ఆ భక్తులను రక్షించే నిమిత్తం స్వీకరించిన నృసింహరూపం భక్తులు దరి చేరేటట్లు, వారి విరోధులు భయపడి పరుగుదీయడానికి తగినట్లు ఉన్నది. ప్రాణుల రూపాలలో గొప్పదైన మానవ రూపంతో, విరోధులను తత్క్షణమే నిరసించగల్గినవాడితడు- అని తెలుపడం కోసం ఆ విరోధులకు భయంకరమైన సింహరూపంతో కూడినది, గొప్ప సటలతో

కూడినది, గొప్ప దంష్ట్రలను (కోరపళ్ళను) కల్గినది, ఇచ్ఛాగృహీతమైనది, అభిమతమైనది అయిన గొప్ప రూపాన్ని పొందిన ఆ నృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

8. యన్నామస్మరణాద్భీతాః భూతవేతాళరాక్షసాః ।
రోగాద్యాశ్చ ప్రణశ్యంతి భీషణం తం నమామ్యహమ్ ॥

ఏ నృసింహభగవానుని తిరునామాన్ని స్మరించినంతలోనే భూతాలు, భేతాళవర్గాలు, రాక్షసులు- అనే బాహ్యవిరోధులు, రోగాలు మొదలైన లోపలి విరోధులు అవి ఉన్న చోటు తెలియని రీతిలో నశించిపోతాయో, భీషణశబ్దవాచ్యుడైన ఆ నృసింహభగవానుని నమస్కరిస్తున్నాను.

9. సర్వేఽపి యం సమాశ్రిత్య సకలం భద్రమశ్నుతే ।
శ్రియా చ భద్రయా జుష్టః యస్తం భద్రం నమామ్యహమ్ ॥

లోకంలో అందఱు ఏ భగవానుని ఆశ్రయించి సకలక్షేమాన్ని పొందుతున్నారో, అందరికి క్షేమాన్ని కల్గించడంవల్ల, భద్రశబ్దవాచ్య అయిన లక్ష్మీదేవిచే నిత్యం ఆశ్రయింపబడినవాడు, భద్రశబ్దవాచ్యుడైన ఆ నృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

10. సాక్షాత్ స్వకాలే సంప్రాప్తం మృత్యుం శత్రుగణానపి ।
భక్తానాం నాశయేద్యస్తు మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥

విష్ణుభక్తులు యమభటులకు వశ్యులు కారనే వాస్తవాన్ని గుర్తించని యముడు వారి దేహావసానసమయంలో వారివద్దకు సాక్షాత్తుగా తానే వచ్చినా, అతనిని, (కామక్రోధాదుల రూపంలోని అంతః) శత్రువులను సంహరించి అనుగ్రహిస్తాడో, మృత్యువుకు మృత్యువైనవాడు, అందువల్లనే "మృత్యుమృత్యు" పదవాచ్యుడైన ఆ శ్రీనృసింహభగవానునకు నమస్కరిస్తున్నాను.

11. నమస్కారాత్మకం యస్మై విధాయాత్మనివేదనమ్ ।
త్యక్తదుఃఖోఽఖిలాన్ కామానశ్నుతే తం నమామ్యహమ్ ॥

ఏ భగవానునివద్ద శరణాగతి అనే ఆత్మరక్షాభరసమర్పణాన్ని చేసి, తన్మూలంగా సమస్తదుఃఖాలు తొలగినవాడై సకలపురుషార్థాలను జీవుడు పొందుతున్నాడో, ఆ శ్రీనృసింహభగవానుని శరణు పొందుతున్నాను.

12. దాసభూతాస్స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః ।
అతోఽహమపి తే దాస ఇతి మత్వా నమామ్యహమ్ ॥

సకలచేతనులు, పరమాత్మకు సహజంగానే దాసులు. అందువల్ల, వారిలో ఒకడనైన నేనుకూడా, ఓ నృసింహస్వామీ ! నీకు దాసుడను -అని తలచి, శేషత్వజ్ఞాన పూర్వకంగా నిన్ను శరణు పొందుతున్నాను.

13. శంకరేణాదరాత్ ప్రోక్తం పదానాం తత్త్వముత్తమమ్ ।
త్రిసంధ్యం యః పఠేత్ తస్య విద్యాఽయుః శ్రీశ్చ వర్ధతే ॥

ఈ విధంగా మంత్రరాజపదాలలోని వాస్తవార్థం శ్రీశంకరునిచే (పరమేశ్వరునిచే) చాలా ఆదరంగా వివరింపబడింది. దీనిని సాయంవేళ, మధ్యాహ్నసమయంలో, సాయంకాలంలోను పఠించేవారికి సద్విద్య, ఆయుస్సు, సంపద వృద్ధిజెందుతుంది.



# ఋణవిమోచన స్తోత్రమ్

1. దేవతాకార్యసిద్ధ్యర్థం సభాస్తంభసముద్భవమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

దేవతల కార్యసిద్ధికోసం హిరణ్యకశిపుని సభలోగల స్తంభంనుండి ఉద్భవించినవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

2. లక్ష్మ్యాఽఽలింగితవామాంకం భక్తానాం వరదాయకమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

లక్ష్మీదేవిచే ఆలింగనం చేసికోబడిన వామాంకాన్ని కలవాడు, భక్తులకు వరాలను ఇచ్చేవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

3. ఆంత్రమాలాధరం శంఖచక్రాబ్జాయుధధారిణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

హిరణ్యకశిపుని (వధించి అతని) పేగులను మాలగా దాల్చినవాడు, ఆయుధాలను ధరించినవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తి కోసం నమస్కరిస్తున్నాను.

4. స్మరణాత్ సర్వపాపఘ్నం కద్రూజవిషనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

(తనను) స్మరణచేయడంవల్ల అన్ని పాపాలను పోగొట్టేవాడు, సర్పవిషాన్ని నశింపజేసేవాడు, మహావీరుడైన శ్రీనృసింహుని ఋణవిముక్తికోసం నమస్కరిస్తున్నాను.

5. సింహనాదేన మహతా దిగ్దంతిభయనాశనమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

తన సింహనాదంతో దిగ్గజాల భయాన్ని తీర్చేవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిమోచనార్థం నమస్కరిస్తున్నాను.

6. ప్రహ్లాదవరదం శ్రీశం దైత్యేశ్వరవిదారణమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

ప్రహ్లాదునకు వరాలను ప్రసాదించినవాడు, లక్ష్మీపతి, దైత్యప్రభువైన హిరణ్యకశిపుని సంహరించినవాడు, మహావీరుడు అయిన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

7. క్రూరగ్రహైః పీడితానాం భక్తానామభయప్రదమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

క్రూరగ్రహాలవల్ల పీడింపబడిన భక్తులకు అభయాన్ని ఇచ్చేవాడు, మహావీరుడైన శ్రీనృసింహస్వామిని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

8. వేదవేదాంతయజ్ఞేశం బ్రహ్మరుద్రాదివందితమ్ ।
శ్రీనృసింహం మహావీరం నమామి ఋణముక్తయే ॥

వేదవేదాంతాలకు, యజ్ఞాలకు ప్రభువు, బ్రహ్మరుద్రుడు మొదలైన దేవతలచే నమస్కరింపబడేవాడు, మహావీరుడైన శ్రీనృసింహుని ఋణవిముక్తికోసం ప్రార్థిస్తున్నాను.

9. య ఇదం పఠతే నిత్యం ఋణమోచనసంజ్ఞితమ్ ।
అనృణీ జాయతే సద్యో ధనం శీఘ్రమవాప్నుయాత్ ॥

ఋణవిమోచనమనే పేరును కల ఈ స్తుతిని నిత్యం ఎవడు పఠిస్తాడో, అతడు ఋణం తీరినవాడై, శీఘ్రంగా ధనాన్ని పొందుతాడు.



శ్రీ సుందరజామాతృముని రచించిన

# నరసింహాష్టకం

## తనియన్ (ప్రార్థనాశ్లోకం)

1. సుందరజామాతృమునేః ప్రపద్యే చరణాంబుజమ్ ।
సంసారార్ణవసమ్మగ్న జంతుసంతారపోతకమ్ ॥

తిరువాయ్మొழி దివ్యప్రబంధానికి "పన్నీరాయిఅప్పడి" అనే వ్యాఖ్యానాన్ని రచించినవారు, తత్త్వదీపం- దీపప్రకాశం మొదలైన పలు గ్రంథాలను అనుగ్రహించిన వాదికేసరి జీయర్ (రమ్యజామాతృముని) దివ్యదేశయాత్రాక్రమంలో పెరుమాళ్ కోయిల్కు (కంచికి) వేంచేసినపుడు కరిగిరికికింద వేంచేసిఉండే నృసింహమూర్తి అర్చారూపం విషయంగా ఈ నృసింహాష్టకస్తుతిని అనుగ్రహించారు.

తిరువల్లిక్కేణి దివ్యదేశానికి వేంచేసినపుడు అక్కడ నెలకొని ఉండే "తెళ్ళియ శిఙ్గప్పెరుమాళ్" అనే నృసింహస్వామి అర్చామూర్తి విషయంగా రచింపబడిందని కొందరు అంటారు. చెవులకు ఇంపైన ఛందస్సులో కూర్పబడ్డ ఈ స్తుతి భక్తులకు నిత్యానుసంధేయమై అలరారుతున్నది.



1. శ్రీమదకలంకపరిపూర్ణశశికోటి -
శ్రీధరమనోహరసటాపటలకాంత !
పాలయ కృపాలయ! భవాంబుధినిమగ్నం
దైత్యవరకాల! నరసింహ ! నరసింహ ! ॥

శ్రీమత్ = కాంతిని (అందాన్ని) కల్గినది, అకలంక = కళంకం లేనిది అయిన, పరిపూర్ణశశికోటి = పలువేల పున్నమిచంద్రుల, శ్రీధర = శోభను ధరించేది, మనోహర = మనస్సును హరించేది అయిన, సటా= సటల (మెడమీదగల జూలు), పటల = సమూహంతో, కాంత = అందమైనవాడా !, కృపా+ఆలయ = దయకు ఆలయమైనవాడా !, దైత్యవర = గొప్పదైత్యుడైన హిరణ్యకశిపునకు, కాల = యమునివంటివాడా, నరసింహ నరసింహ = ఓ నరసింహస్వామీ, భవ+అంబుధి = సంసారమనే సముద్రంలో, మగ్నం = (మాం) మునిగిన (నన్ను), పాలయ = రక్షించు.

సింహానికి మెడమీద ఉండే కేశాలకు సటలని పేరు. **"అ*ழ*కియాన్‌తానే అరియురువన్ తానే"** (అందమైనవాడు, నరసింహరూపుడు) అనే రీతిలో అత్యంత సుందరుడై అవతరించిన శ్రీనరసింహమూర్తికి గల సటాపటలం పరమవిలక్షణంగా ఉంటుంది. కళంకం లేని పరిపూర్ణచంద్రులు కోట్ల సంఖ్యలో ఒకేకాలంలో ఉదయిస్తే ఎంత అందంగా ఉంటుందో, అంత అందంగా ఆ సటాపటలం ఉన్నది. **"అకలంకపరిపూర్ణ..** అనే ప్రయోగం, అభూతోపమ. చంద్రమండలం కళంకం లేనిదై ఉంటే పరిపూర్ణంగా ఉండదు. పరిపూర్ణంగా ఉంటే అకలంకంగా ఉండదు. **"యద్దాతుస్సౌమ్యతా సేయం పూర్ణేందోరకలంకతా"** (పూర్ణచంద్రుడు కళంక రహితుడుగా ఉండనట్లు, దాత సౌమ్యతను కల్గినవాడై ఉండడు) అనే కవివచనంవల్ల ఇది స్పష్టం.

**(కృపాలయ) - "శీ*ற்ற*త్తోడు అరుళ్ పె*ற்ற*వన్ అడిక్కీ*ழ్* పుకనిన్ఱ శెజ్గణ్‌మాల్"** (తిరువాయ్‌మొ*ழి*-3-6-6) అనే రీతిలో హిరణ్యునిపట్ల కోపం అంతు లేకుండా ఉన్నా, శ్రీప్రహ్లాదా*ழ్*వాన్ పట్ల కరుణే మూర్తీభవించినట్లున్న తీరును ఈ విశేషణం తెల్పున్నది.

**(దైత్యపరకాల)** - **"దైత్యవర"** అని హిరణ్యునిమాత్రం నిర్దేశించినట్లు చెప్పవచ్చు. దైత్యవర్గాన్ని అంతటిని చెప్పినట్లుగా గ్రహించవచ్చు. కాలుడంటే మృత్యువు. **"నరసింహ నరసింహ"** అనే ద్విగుణోక్తి ఆదరాతిశయంవల్ల **"పిఱవి క్కడలు అన్దు నాన్ తుళఙ్గ"** (జన్మవారిధిలో అపుడు నేను తల్లడిల్లగా) అనే రీతిలో జన్మవారిధిలో మునిగిన నాకు నీకృపతప్ప వేఱు రక్షకం లేదు-అని తాత్పర్యం.

2. **పాదకమలావనతపాతకిజనానాం**
**పాతకదవానల ! పతత్త్రివరకేతో !**
**భావనపరాయణ ! భవార్తిహరయా మాం**
**పాహి కృపయైవ నరసింహ ! నరసింహ !॥**

పాదకమల = తన శ్రీచరణపద్మాలలో, అవనత = నమస్కరించిన, పాతకి జనానాం = పాపిష్ఠిజనుల, పాతక = పాపాలకు, దవానల = కార్చిచ్చువంటివాడా !, పతిత్త్రివరకేతో = పక్షిరాజు అయిన గరుడుని ధ్వజంగా కలవాడా !, భావనపరాయణ = తనను చింతించే వారికి గొప్ప గతి అయినవాడా !, నరసింహ నరసింహ = ఓ నరసింహస్వామీ !, భవ+ఆర్తిహరయా = సంసారతాపాన్ని తీర్చగల్గిన, కృపయా+ఏవ = నీ కరుణతోనే, మాం పాహి = నన్ను రక్షించు.

తనను ఆశ్రయించినవారు ఎంతటి పాపాలను చేసినా, **"పోయ పిழైయుమ్ పుకుతరువాన్ నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్"** (శరణాగతి చేయడానికి ముందు చేసిన పాపాలు, తరువాత ప్రమాదవశాత్తు చేసిన పాపాలు అన్నీ అగ్నిలో పడిన దూదివలె రూపుమాసిపోతాయి) అనే రీతిలో వాటిని రూపుమాపగల స్వామీ ! గడరుడధ్వజా ! నిన్ను భావించే వారికి ఉపాయమై, ఉపేయమై ఉండేవాడా ! సాంసారిక క్లేశాలను అన్నిటిని పోగొట్లే స్వభావాన్ని కల నీకృపతోనే నిత్యసంసారిని అయిన నన్ను కాపాడాలి.

**"కృపయైవ"** అనే ప్రయోగంలోని ఏవకారంతో నావద్ద ఏవిధమైన రక్షకం లేదు, నేను అకించనుడను- అని తెలుపబడింది.

3. **తుంగనఖపంక్తి దళితాసురవరాసృక్ -**
**పంకనవకుంకుమ విపంకిలమహోరః ! ।**

**పండితనిధాన ! కమలాలయ ! నమస్తే**
**పంకజనిషణ్ణ ! నరసింహ ! నరసింహ !**

తుంగ = పొడుగైన, నఖ పంక్తి = గోళ్ళవరుసలతో, దళిత = బ్రద్దలు చేయబడిన, అసురవర = హిరణ్యాకశిపునియొక్క, అసృక్ = రక్తంయొక్క, పంక= బురద అనే, నవకుంకుమ = కొత్తదైన కుంకుమతో, విపంకిల = (బురదను కల్గినదిగా చేయబడిన) వ్యాప్తమైన, మహోరః = వక్షస్థలాన్ని కలవాడా !, పండితనిధాన= పండితులకు నిధి అయినవాడా !, కమలాలయ = లక్ష్మీదేవికి ఆశ్రయమైనవాడా !, పంకజనిషణ్ణ = ఆసనపద్మంలో వేంచేసి ఉన్నవాడా !, నరసింహ నరసింహ = నరసింహస్వామీ ! తే నమః = నీకు నమస్కారం.

**"అఙ్గణ్ ఞాలమఞ్జ అఙ్గోర్ ఆళరియాయ్ అవుణన్ పొఙ్గవాకమ్ వళ్ళుకిరాల్ పోழ்న్ద పునితన్"** (విశాలమైన భూమి అంతా భయాన్ని పొందేటట్లు హిరణ్యకశిపుని వక్షస్సును బలమైన నఖాలతో చీల్చిన పవిత్రుడు) అని, **"పోరార్ నెడువేలోన్ పొన్‌పెయరోన్‌ఆకత్తై కూరార్‌న్ద వళ్ళుకిరాల్ కీణ్డు, కుడల్‌మాలై శీరార్ తిరుమార్బిన్‌మేల్ క్కట్టి చ్చెఙ్గురుతి శోరా క్కిడన్దానై క్కుఙ్కుమత్తోళ్ కొట్టి ఆరావెழுన్దాన్ అరియురువాయ్"** (ఎల్లప్పుడు యుద్ధంలో ఆసక్తికిని కల్గిన, పొడుగైన వేలాయుధాన్ని ధరించిన హిరణ్యకశిపుని శరీరాన్ని నరసింహరూపియై మిక్కిలి పదునైన గోళ్ళతో చీల్చి, ఆ అసురుని పేగులను బయటకు తీసి, అందమైన లక్ష్మీ దేవికి నివాసమైన తన వక్షఃస్థలంలో మాలికగా ధరించి, ఎఱ్ఱని రక్తప్రవాహం స్రవించే ఆ అసురుని కుంకుమపంకంతో అలంకరింపబడ్డ తన బాహులపై ప్రహరించు కుంటూ, గొప్పగా గర్జిస్తూ పైకి లేచినవాడు) అని కీర్తించే రీతిలో హిరణ్యకశిపుడనే అసురుని వక్షస్సును నఖాలతో చీల్చిన కాలంలో ఆ వక్షస్సునుండి పెల్లుబికిన రక్తప్రవాహం అక్కడ కుంకుమపంకం అలదినట్లుగా తోచింది. ఈ విషయాన్ని శ్లోకంలోని పూర్వార్ధం తెలుపుతున్నది. **"మహోరాః"** అనే ప్రథమావిభక్తిపదం సంబోధనవిభక్తిలో **"మహోరః"** అని అవుతుంది. **"వైత్త మానిది"** అని, **"అంతర్హితో నిధిరసి"** అని కీర్తించే రీతిలో గొప్ప నిధివంటివాడుకదా స్వామి. నిధి, లోపల గుప్తంగా ఉంటూ ఒకానొక కాలవిశేషంలో భాగ్యవంతులకుమాత్రం వ్యక్తమవు తుంది. ఆ విధంగానే కదా నృసింహమూర్తి రీతికూడా.

**(కమలాలయ)** - కమలానాథ - అని అర్థం. నరసింహరూపాన్ని పరిగ్రహించినపుడు ముల్లోకాలు భయపడి కలతచెందే రీతిలోని తీవ్రమైన కోపం కల్గడాన్నిచూచి, ఆ కోపాన్ని ఉపశమింపజేయడానికి శ్రీమహాలక్ష్మి వచ్చి చేరగా, లక్ష్మీ నరసింహుడుగా స్వామి ప్రసిద్ధుడు కావడం స్మరణీయం.

**(పంకజనిషణ్ణ) - "తణ్డామరై శుమక్కుమ్ పాదప్పెరుమాన్"** (చల్లని తామర పూవుచే మోయబడే పాదాలను కల స్వామి) అని భావం.

**4. మౌలిషు విభూషణమివామరవరాణాం**
**యోగిహృదయేషు చ శిరస్సు నిగమానామ్ ।**
**రాజదరవిందరుచిరం పదయుగం తే**
**దేహి మమ మూర్ధ్ని నరసింహ ! నరసింహ !**

నరసింహ నరసింహ = నరసింహస్వామీ !, అమరవరాణాం = గొప్ప దేవతల, మౌళిషు = కిరీటాలలో, యోగిహృదయేషు = యోగుల హృదయాలలోను, నిగమానాం శిరస్సు చ = వేదాల శిరస్సులలో (వేదాంతాలలో) విభూషణమ్ ఇవ= గొప్ప భూషణంవలె, రాజత్ = ప్రకాశించే, అరవిందరుచిరం = తామరపూవువలె అందమైన, తే పదయుగం = నీ చరణద్వయిని, మమ మూర్ధ్ని = నా శిరస్సుపై, దేహి = పెట్టి అనుగ్రహించాలి.

**"కోలమామ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కురై కழలే"** (నా శిరస్సుకు కమలంవంటి, ధ్వనించే, అందెలను కల నీ పాదాలు అలంకారం) అని, **"అడిచ్చియోమ్ తలైమిశై నీ యణియాయ్ ఆழியమ్ కణ్ణా ఉన్ కోలప్పాదమ్"** (అందమైన నేత్రాలను కల శ్రీకృష్ణా! నీ అందమైన పాదాలను దాసురాండ్రమైన మా శిరస్సులపై అలంకరించు) అని ఆழ்వార్లు ప్రార్థించిన రీతిలో స్తుతికర్త ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు. దేవతల కిరీటాలకు ఆభరణమై వెలుగుతున్నది, మునువరులచే, యోగులచే తమ హృదయాలలో ధ్యానింపబడేది, **"వేదాన్తవిழு ప్పొరుళిన్ మేలిరున్ద విళక్కు"** (వేదాంతాలలోని గొప్ప అర్థాలలో ప్రకాశించే దీపంవంటివాడు) అనే రీతిలో వేదశిరస్సులకు పరమ భోగ్యంగా ప్రకాశిస్తున్న నీ శ్రీచరణద్వయాన్ని నా శిరస్సుకు భూషణంగా చేర్చి కృపజేయాలి - అని భావం. **"విభూషణమ్"** అనే పదాన్ని సప్తమ్యంత పదాలన్నిటితో అన్వయించాలి.

5. వారిజవిలోచన ! మదంతిమదశాయాం
క్లేశవివశీకృత సమస్తకరణాయామ్ ।
ఏహి రమయా సహ శరణ్య ! విహగానాం
నాథమధిరుహ్య నరసింహ ! నరసింహ! ॥

వారిజవిలోచన ! = కెందామరలవంటి నేత్రాలను కలవాడా !, శరణ్య = (దాసునివంటి దీనులకు) గొప్ప శరణమైనవాడా !, నరసింహ నరసింహ = ఓ నరసింహస్వామీ!, క్లేశవివశీకృత సమస్తకరణాయాం = (చెవులు, కన్నులు మొదలైన) అన్ని కరణాలను క్లేశానికి వశం చేసే నా చరమావస్థలో, రమయా సహ = లక్ష్మీదేవితోకూడ, విహగానాం నాథం = పక్షినాథుడైన గరుత్మంతుని, అధిరుహ్య = ఎక్కి, ఏహి = (నావద్దకు) రావాలి.

**"ఎయ్ప్పెన్నై వన్దు నలియుమ్బోదు అజ్గేదుమ్ నానున్నై నినైక్కమాట్టేన్, అప్పోదైక్కు ఇప్పోదే శొల్లివైత్తేన్"** (మృత్యువు నావద్దకు వచ్చి బాధించేటప్పుడు నేను నిన్ను స్మరించలేను. ఆ సమయానికి బదులుగా ఇప్పుడే నీ నామాన్ని అనుసంధానం చేస్తున్నాను) అనే భట్టనాథసూరిసూక్తి క్రమంలో ఈ శ్లోకం రచింప బడింది. **"మేల్ ఎ*ழு*న్దదోర్ వాయుక్కిళర్న్దు మేల్మిడ*ற்றி*నై యుళ్ళె*ழு*వాజ్గి, కాలుమ్ కైయుమ్ ఎదిర్ ఎదిర్త్తేటి క్కణ్ణుఅక్కమదావతు"** (ఊర్ధ్వశ్వాస పైకెగసి, మనస్సు వికలమై, కాళ్ళు చేతులు గబగబ తన్నుకొని, దీర్ఘనిద్రను పొందడానికి ముందే) అని, **"మడివ*ழி*న్దు నీర్ప్పులన్ శోర వాయిలట్టియ కఞ్జియుమ్ మీణ్డే, కడైవ*ழி* వార క్కణ్డ మడైప్ప క్కణ్ణుఅక్క మదావతు"** (యమభటులను చూచిన భయంతో గుహ్యేంద్రియంనుండి మూత్రం స్రవించగా, నోటిలో పోసిన గంజి గొంతులో అడ్డుపడడం వల్ల ఒకవైపు నుండి బయటకు కారగా, దీర్ఘనిద్రను పొందడానికి ముందే) అని, **"వాయొరు పక్కమ్ వాజ్గి వలిప్ప వార్న్ద నీర్క్కు*ழி* క్కణ్గళ్ మి*ழ*ற్ఱ త్తాయొరుపక్కమ్ తన్దై యొరుపక్కమ్ తారముమొరుపక్క మల*ற்ற*"** (వాతవికారంవల్ల నోరు ఒకవైపు వంకరపోయి బాధించగా, బంధువులను వదలి వెళ్ళిపోతున్నానే! అనే బాధతో కంటినిండుగా నీళ్ళు నిండగా, తల్లి ఒకవైపు, తండ్రి ఒకవైపు, భార్య ఇంకొక వైపు రోదించగా ) అని చెప్పబడిన రీతిలో అంతిమ కాలంలో సంభవించే అవస్థలకు ఒక క్రమం, అంతు ఉండదుకదా. మనోవాక్కా

యాలు అనే కరణక్రమాలు అన్నీ క్లేశపడే ఆస్థితిలో **"కాష్ఠపాషాణ సన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్"** (చివరిదశలో కట్టెవలె, రాయివలె అచేతనంగా పడిఉండే నా భక్తుని నేను స్మరిస్తాను. అతనిని ఉత్తమ గతికి తీసికొనిపోతాను) అనే వరాహచరమశ్లోకక్రమంలో **"పఱవై యేఱు పరమ్పురుడా!"** (గరుడుని అధిరోహించే పరమపురుషా!) అన్నట్లు గరుడారూఢుడై లక్ష్మీసహితుడై వేంచేసి, పాపిని అయిన నన్ను పరిగ్రహించాలి- అని ప్రార్థిస్తున్నారు, ఈ శ్లోకంలో. **"వారిజవిలోచన"** అనే సంబోధన **"కిఙ్కిణి వాయ్చ్చెయ్ద తామరైప్పూప్పోలే శెఙ్గణ్ శిఱుచ్చిఱుదే ఎమ్మేల్ విழியావో"** (మువ్వలవంటి తామరపూలవలె ఉండే అందమైన నేత్రాలతో మెల్లమెల్లగా మమ్ములను కటాక్షించు) అనే తిరుప్పావైసూక్తి భావాన్ని తలపిస్తున్నది.

6. **హాటకకిరీట వరహారవనమాలా-**
**తారరశనా మకరకుండలమణీంద్రైః ।**
**భూషితమశేషనిలయం ! తవ వపుర్మే**
**చేతసి చకాస్తు నరసింహ నరసింహ ॥**

నరసింహ నరసింహ = ఓ నరసింహస్వామీ !, హాటకకిరీట = బంగారుతో చేయబడిన కిరీటం, వనమాలా = వైజయంతి అనబడే వనమాల, తారరశనా = ముత్యాలమయమైన మొలనూలు, మకరకుండలమణీంద్రైః = మకరకుండలాలు అనే ఈ ఆభరణాలచే, భూషితం = అలంకరింపబడినది, అశేషనిలయం = అంతటా వ్యాపించినది అయిన, తవ వపుః = నీ దివ్యమంగళరూపం, మే చేతసి = నా మనస్సులో, చకాస్తు = ప్రకాశించుగాక !

**"శెఙ్కమల క్కழలిల్ శిற்றிతழ்పోల్ విరలిల్ శేర్ తికழ் ఆழிకళుమ్ కిఙ్కిణియుమ్ అరైయిల్ తఙ్గియ పొన్ వడముమ్ తాళ నన్ మాతుళైయిన్ పూవొడు పొన్మణియుమ్ మోదిరముమ్ కిఱియుమ్ మఙ్గల ఐమ్పడైయుమ్ తోళ్ వళైయుమ్ కుழైయుమ్ మకరముమ్ వాழிకళుమ్ శుట్టియుమ్"** (ఎఱ్ఱని తామరల వంటి శ్రీచరణాల్లో లోపలి రేకులవలె చిన్నవిగా ఉండే వేళ్ళలో వెలిగే వ్రేలి ఉంగరాలు, మువ్వలు, నడుమున ధరించిన బంగారు మొలనూలు, చిరుగంటలను కలిగి, మధ్యలో దానిమ్మ పూలు పొదిగిన, బంగారు మణులతో చేసిన హారం, చేతివేళ్ళలోని

ఉంగరాలు, మణికట్టుకు అలంకరించిన చిన్న పగడపు మాలలు, శుభకరమైన పంచాయుధహారం, చేతివేళ్ళలోని ఉంగరాలు, కర్ణాభరణాలు, మకరకుండలాలు, కర్ణపుష్పాలు, కేశాలలో అలంకారంగా బంధింపబడి నుదుటిలో వేలాడే బొట్టు వంటి ఆభరణం) అనే రీతిలోని పలు ఆభరణాలను అలంకరించుకొన్న తిరుమేని తమ మనస్సులో ప్రకాశించాలి - అని ఇందులో ప్రార్థిస్తున్నారు.

**(తారరశనా)** - తారమనే పదం ముత్యాన్ని తెలుపుతుంది. నక్షత్రమాల అనబడే ఆభరణాన్ని ఈప్రయోగం తెలుపుతుందనికూడా చెప్పవచ్చు.

**(మణీంద్రైః)** -రత్నవాచకమైన ఈ శబ్దం లక్షణావృత్తిద్వారా రత్నప్రచురాలైన భూషణాలను తెలుపుతున్నదని చెప్పవచ్చు.

**(అశేషనిలయమ్)** - నిలయశబ్దం నిత్యపుంలింగవాచకం. కనుక ఇక్కడ బహుప్రీహిగా చెప్పాలి. అశేషాన్ని (సమస్తాన్ని) నిలయంగా కలవాడని భావం.

7. **ఇందురవిపావకవిలోచన ! రమాయా**
**మందిర ! మహాభుజలసద్వరరథాంగ ।**
**సుందర! చిరాయ రమతాం త్వయి మనో మే**
**నందితసురేశ ! నరసింహ ! నరసింహ! ॥**

ఇందు రవి పావక విలోచన = చంద్రుడు, సూర్యుడు, అగ్ని- అనే వీరిని నేత్రాలుగా కలవాడా !, రమాయాః = లక్ష్మీదేవికి, మందిర = ఆశ్రయమైనవాడా ! మహాభుజ = గొప్ప భుజాలలో, లసత్ = వెలిగే, వర రథాంగ = గొప్ప సుదర్శనాన్ని కలవాడా !, సుందర = అందమైనవాడా !, నరసింహ నరసింహ = ఓ నరసింహస్వామీ!, నందితసురేశ = అమరులను ఆనందింపజేసినవాడా !, మే మనః = దాసుడనైన నా మనస్సు, త్వయి = నీయందు, చిరాయ = చిరకాలం, రమతాం = ఆనందించుగాక !

నరసింహావతారంలో నిప్పుకణాలను వెదజల్లే లలాటనేత్రమని మూడవదిగా స్ఫురించినందున, క్రమమైన రెండు కన్నులు చంద్ర-సూర్యులుగాను, మూడవది అయిన లలాటనేత్రం అగ్నిగాను- మొదటి పాదంలో కవి పల్కుతున్నారు. ఈలలాటనేత్రాన్ని ఆర్పడంకోసమే లక్ష్మీదేవి వచ్చి తిరుమేనిలో వేంచేసి ఉన్నందున **"రమాయా మందిర"** అని అన్నారు. **"మహాభుజలసద్దరరథాంగ"** అనే పాఠం కూడా

ఉన్నది. "ధర" అనే శంఖానికి వాచకం కనుక, శంఖచక్రాలను రెండిటిని నిర్దేశించినట్లయింది.

8. **మాధవ ! ముకుంద ! మధుసూదన ! మురారే !**
**వామన ! నృసింహ! శరణం భవ నతానామ్ ।**
**కామద ! ఘృణిన్ ! నిఖిలకారణ ! నయేయం**
**కాలమమరేశ ! నరసింహ ! నరసింహ ! ॥**

మాధవ = శ్రియఃపతీ, ముకుంద = ముక్తినిచ్చేవాడా !, మధుసూదన = మధువు అనే అసురుని సంహరించినవాడా !, మురారే = (నరకాసుర వధ సందర్భంలో) మురుని వధించినవాడా !, వామన = వామనమూర్తీ !, నృసింహ = నరసింహస్వామీ !, నతానాం = నీకు శరణాగతి చేసినవారికి, శరణం భవ = శరణం కావాలి, కామద = కోరిన కోరికలను ఇచ్చేవాడా !, నిఖిలకారణ = సకల కారణభూతుడా !, అమరేశ = దేవతలకు స్వామీ !, నరసింహ నరసింహ = నరసింహమూర్తీ (అని ఈ రీతిలో నీ తిరునామాలను సంకీర్తనం చేస్తూ), కాలం నయేయం = కాలాన్ని గడపుతాను.

"క్రోశన్ మధుమథన! నారాయణ! హరే! మురారే! గోవిందే త్యనిశమపనేష్యామి దివసాన్" (మధుసూదనా! నారాయణా! హరీ! మురారీ! గోవిందా! అని అంటూ సదా నీ నామాలను అనుసంధిస్తూ కాలాన్ని గడుపుతాను.) అని పరాశరభట్టర్ శ్రీరంగనాథస్తోత్రంలో అనుగ్రహించిన రీతిలో ఈశ్లోకం రచింపబడింది. మూడవ పాదంలో "ఇతి" అని అధ్యాహరించుకోవాలి.

"కాలం నయేయమ్" అనే ప్రయోగంలోని "కాల" శబ్దానికి యముడనే అర్థాన్ని గ్రహించి, యముని నియంత్రించి పాలించగలను- అనే అర్థాన్ని చెప్పే వీలున్నా, అది అంత సరసం కాదు. "ఘృణీ" అంటే దయాళువు. "ఘృణా" - దయ. దానిని కలవాడు ఘృణి.

9. **అష్టకమిదం సకలపాతకభయఘ్నం**
**కామదమశేషదురితామయ రిపుఘ్నమ్ ।**
**యః పఠతి సంతతమశేషనిలయం తే**
**గచ్ఛతి పదం స నరసింహ ! నరసింహ ! ॥**

నరసింహ నరసింహ = ఓ నృసింహమూర్తీ !, సకలపాతకభయఘ్నం = అన్ని పాపాలను, అన్ని భయాలను పోగొట్టేది, కామదం = అన్ని అపేక్షితాలను ఇచ్చేది, అశేష = అన్ని, దురిత = పాపాలను, ఆమయ = వ్యాధులను, రిపుఘ్నం= శత్రువులను నశింపజేసేది అయిన, ఇదమ్ అష్టకం = ఈ నృసింహాష్టకాన్ని, యః సంతతం పఠతి = ఎవడు నిత్యం పఠిస్తున్నాడో, సః = అతడు, అశేషనిలయం = అన్నిటికి ప్రాప్యమైన, తే పదం = నీ స్థానాన్ని, గచ్ఛతి = పొందుతున్నాను.

ఈ శ్లోకం ద్వారా, ఈ అష్టకస్తుతిని పఠించినవారికి కలిగే ఫలాన్ని తెలుపుతూ కవి స్తుతిని ముగిస్తున్నారు. మొదటి పాదంలోని పాతకశబ్దం మహా పాతకాలను, రెండవ పాదంలోని దురితశబ్దం ఉపపాతకాదులను తెల్పుతుంది. కనుక పునరుక్తి లేదు. అనిష్టనివారణం, ఇష్టప్రాపణం- అనే రెండిటిని ఇచ్చే ఈ స్తుతిని నిత్యం పఠించేవారు పరమపదాన్ని పొందగలరు- అనే స్తుతిపఠనఫలాన్ని పల్కి స్తుతిని కవి ముగించారు.

# హర్యష్టకం

1. హరి ర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।
   అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః ॥

చెడ్డమనస్సును కలిగినవారు సైతం మనః పూర్వకంగా హరి అనే నామాన్ని స్మరిస్తే వారి పాపాలను ఆ నామం పోగొడుతుంది. అనుకోకుండా తాకిన నిప్పు కూడా దహిస్తుంది కదా.

2. స గంగా స గయా సేతు స కాశీ స చ పుష్కరమ్ ।
   జిహ్వాగ్రే వర్తతే యస్య హరి రిత్యక్షరద్వయమ్ ॥

ఎవరి నాలుక చివరిపై హరి అనే రెండు అక్షరాలు ఉంటాయో అతడే గంగానది. అతడే గయా క్షేత్రం, సేతువు, కాశి, అతడే పుష్కరనబడే క్షేత్రం.

3. వారాణస్యాం కురుక్షేత్రే నైమిశారణ్య ఏవ చ ।
   యత్ కృతం తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో అతడు కాశీ నగరంలో, కురుక్షేత్రంలో, నైమిశారణ్యంలో పుణ్యకార్యాలను చేసినవాడు అవుతున్నాడు.

4. పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యాయతనాని చ ।
తాని సర్వాణ్యశేషాణి హరిరిత్యక్షరద్వయమ్ ॥

భూమిపై ఏ పుణ్యతీర్థాలున్నాయో, దేవాలయాలున్నాయో అవి అన్నీ హరి అనే రెండక్షరాలతో సమానం.

5. గవాంకోటి సహస్రాణి హేమకన్యాసహస్రకమ్ ।
దత్తం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥

ఎవరిచేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో అతడు వేలాది కోట్ల గోవులను, బంగారాన్ని, వేలాది కన్యలను దానం చేసిన పుణ్యాన్ని పొందు తున్నాడు.

6. ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదోఽ ప్యథర్వణః ।
అధీతస్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥

ఎవరి చేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడ్డాయో అతడు ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని, సామవేదాన్ని, అధ్వరణ వేదాన్ని అధ్యయనం చేసినవాడు అవుతున్నాడు.

7. అశ్వమేధైః మహాయజ్ఞైః నరమేధైః తథైవ చ ।
ఇష్టం స్యాత్తేన యేనోక్తం హరిరిత్యక్షరద్వయమ్ ॥

ఎవరి చేత హరి అనే రెండక్షరాలు ఉచ్చరింపబడతాయో అతడు అశ్వమేథ మహాయాగాలను, నరమేథమహాయాగాలను చేసినవాడు అవుతున్నాడు.

8. ప్రాణప్రయాణ పాథేయం సంసారవ్యాధినాశనమ్ ।
దుఃఖాత్యంత పరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్ ॥

హరి అనే రెండక్షరాలు ప్రాణం పోయే సమయంలో దారిభత్యంవంటిది, సంసారమనే వ్యాధిని నశింపజేసేది, దుఃఖాలనుండి పూర్తిగా రక్షించేది.

9. బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి ।
సకృదుచ్చరితం యేన హరిరిత్యక్షరద్వయమ్ ॥

ఎవరిచేత హరి అనబడే రెండక్షరాలు ఉచ్చరింపబడుతున్నాయో ఆతడు మోక్షానికి పోవడంకోసం తగిన పరికరాలను సిద్ధం చేసుకొన్నవాడౌతున్నాడు.

10. హర్యష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
ఆయుష్యం బలమారోగ్యం యశోవృద్ధి శ్రియాఽవహమ్ ॥

ఎవడు ఈ పవిత్రమైన హర్యష్టకమనే స్తోత్రాన్ని ఉదయ కాలంలో లేచి పఠిస్తున్నాడో అతడు ఆయుస్సును, బలాన్ని, ఆరోగ్యాన్ని, కీర్తిని, వృద్ధిని సంపదను పొందుతున్నాడు.

11. ప్రహ్లాదేన కృతం స్తోత్రం దుఃఖసాగరశోషణమ్ ।
యః పఠేత్ శృణుయాద్వాఽపి సర్వాన్ కామా నవాప్నుయాత్ ॥

దుఃఖమనే సముద్రాన్ని ఎండించేది, ప్రహ్లాదునిచే రచింపబడినది అయిన ఈ స్తోత్రాన్ని ఎవడు పఠిస్తున్నాడో, లేక వింటున్నాడో అతడు అన్ని కోరికలను పొందగలడు.

# శ్రీనృసింహద్వాదశనామ స్తోత్రం

1. ప్రథమం తు మహాజ్వాలో ద్వితీయం తూగ్రకేసరీ ।
తృతీయం వజ్రదంష్ట్రశ్చ చతుర్థం తు విదారణః ॥

పంచమం నారసింహశ్చ షష్ఠః కాశ్యపమర్దనః ।
సప్తమో రక్షహంతా స్యాదష్టమో దీనవల్లభః ॥

నవః ప్రహ్లాదవరదో దశమోఽనంతహస్తకః ।
ఏకాదశో మహారుద్రో ద్వాదశో కరుణానిధిః ॥

ద్వాదశైతాని నామాని నృసింహస్య మహాత్మనః ।
ఆవర్తయన్ సహస్రం తు లభతే వాంఛితం ఫలమ్ ॥

# శ్రీలక్ష్మీ నృసింహాష్టోత్తర శతనామ స్తోత్రమ్

నారసింహో మహాసింహో దివ్యసింహో మహాబలః ।
ఉగ్రసింహో మహాదేవః స్తమ్భజ శ్శోగ్రలోచనః ॥

రౌద్ర స్సర్వాద్భుత శ్శ్రీమాన్ యోగానన్ద స్త్రివిక్రమః ।
హరిః కోలాహల శ్చక్రీ విజయో జయవర్ధనః ॥

పఞ్చాననః పరంబ్రహ్మ చాఘోరో ఘోరవిక్రమః ।
జ్వలన్ముఖో జ్వాలమాలీ మహాజ్వాలో మహాప్రభుః ॥

నిటలాక్ష స్సహస్రాక్షో దుర్నిరీక్షః ప్రతాపనః ।
మహాదంష్ట్రాయుధః ప్రాజ్ఞ శ్చణ్డకోపీ సదాశివః ॥

హిరణ్యకశిపుధ్వంసీ దైత్యదానవభంజనః ।
గుణభద్రో మహాభద్రో బలభద్ర స్సుభద్రకః ॥

కరాళో వికరాళశ్చ వికర్తా సర్వకర్తృకః ।
శింశుమార స్త్రిలోకాత్మా ఈశస్సర్వేశ్వరో విభుః ॥

భైరవాడమ్బరో దివ్య శ్చాచ్యుతః కవిమాధవః ।
అధోక్షజోక్షర శ్శర్వో వనమాలీ వరప్రదః ॥

విశ్వమ్భరోఽద్భుతో భవ్యః శ్రీవిష్ణుః పురుషోత్తమః ।
అనఘాస్త్రో నఖాస్త్రశ్చ సూర్యజ్యోతి స్సురేశ్వరః ॥

సహస్రబాహు స్సర్వజ్ఞ స్సర్వసిద్ధిప్రదాయకః ।
వజ్రదంష్ట్రో వజ్రనఖో మహానన్దః పరన్తపః ॥

సర్వమంత్రైకరూపశ్చ సర్వయంత్రవిదారణః ।
సర్వతంత్రాత్మకోఽ వ్యక్త స్సువ్యక్తో భక్తవత్సలః ॥

వైశాఖశుక్లభూతోత్థ శ్శరణాగతవత్సలః ।
ఉదారకీర్తిః పుణ్యాత్మా మహాత్మా చణ్డవిక్రమః ॥

వేదత్రయప్రపూజ్యశ్చ భగవాన్ పరమేశ్వరః ।
శ్రీవత్సాఙ్కః శ్రీనివాసో జగద్వ్యాపీ జగన్మయః ॥

జగత్పాలో జగన్నాథో మహాకాయో ద్విరూపభృత్ ।
పరమాత్మా పరంజ్యోతి ర్నిర్గుణశ్చ నృకేసరీ ॥

పరతత్త్వం పరంధామ సచ్చిదానన్దవిగ్రహః ।
లక్ష్మీనృసింహ స్సర్వాత్మా ధీరః ప్రహ్లాదపాలకః ॥

ఇదం శ్రీమన్నృసింహస్య నామ్నామష్టోత్తరం శతమ్ ।
త్రిసంధ్యం యః పఠేద్భక్త్యా సర్వాభీష్టమవాప్నుయాత్ ॥



# శ్రీనృసింహ గాయత్రీ మంత్రము

వజ్రనఖాయ విద్మహే । తీక్ష్ణదంష్ట్రాయ ధీమహి ।
తన్నో నారసింహః ప్రచోదయాత్ ॥

# శ్రీనృసింహానుష్టుప్

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్ ।
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్ ॥

